

ఆంధ్రా ప్రింటర్స్. హైరోడ్, చిత్తూరు.

శ్రీరస్తు. శుభమస్తు. అవిఘ్నమస్తు.

ఓం.

# శ్రీ గోవింద శతకము



అంకితము:

కలియుగమున వెలసిన

శ్రీ శ్రీ శ్రీ కల్యాణ వేంకటేశ్వరస్వామి

దివ్యచరణకమలములకు భక్తిపూర్వకముగ నర్పించు

పూజా ప్రసూనములుగ,

ఎస్. వారణాశి.

మూల్యము: అమూల్యము.

# భగవత్సందేశము

శ్రీ శ్రీ శ్రీ వేంకటేశ్వరస్వామి వారు నాకు యీ క్రింది విషయములు శ్రీ గోవిందశతక విషయమై పాఠకులకందజేయమని తెల్పియున్నారు :—

"1. ఈ శ్రీ గోవింద శతకము" శ్రీ స్వామివారి ప్రేరేపణపై యీ రచయిత్రి యస్. వారణాశి ద్వారా పురాణవిషయములతో మేళవింపజేసి లిఖింపబడి అచ్చొత్తించి భక్తకోటికి ఉచితముగానిచ్చు నిమిత్తమై యే శాస్త్రముతోను నిమిత్తము లేకుండనే నిర్ణయింపబడినది.

2. ఈ సద్గ్రంథము పఠించు భక్తులెల్లరు భక్తి విశ్వాసములను తమలో తొలిగా రంజింపజేసుకొని నిష్ఠనియామములతో ఆనందముగా పఠించిన తప్పక శ్రీబాలాజివారి నిదర్శనములు చవిచూడగలరను చెప్పుటలో సందేహము వలదు.

3. ఈ గ్రంథవిషయమై ఆక్షేపణకు, అనవసర వ్యాఖ్యానములకు తావీయవలదు. తావిచ్చి తమ కగపడని యిక్కట్లకు గురిగాకండి.

4. నాచే యోగశక్తిలో శ్రీ స్వామి దాసుకి బోధింపబడిన "శ్రీవేంకటేశ్వర శతకము" యీ పై భక్తురాలను ప్రోత్సహించి ఈ సద్గ్రంథము వెల్వడింపజేసినది

5. శ్రీ స్వామి వారి ప్రత్యక్ష పరోక్ష నిదర్శనలు చవిచూడ యిచ్ఛగింపగల్గిన భక్తులు ఎవరైననుసరే కాకినాడ తాలుకా, తూరంగిగ్రామమున వెలసియున్న శ్రీ శ్రీ శ్రీ స్వామివారిని నిత్యానంద గృహస్థాశ్రమమును దర్శించి ధన్యులుకండి

6. ఎట్టి సమస్యలకైనను తగు సమాధానము దొరకును.

7. ఆశ్రమమునకు దర్శించు భక్తులు తలస్నానం బాచరించి ప్రత్యేకముగా ఆదివారము ఉదయం 8 గంటలకు దర్శించిన శ్రీ స్వామివారి సేవలు తిలకించగలరు. ఆశ్రమమునకు వచ్చువారు భక్తితోను, తృప్తితోను తులసిదళములు తెచ్చినను సంతోషమే".

శ్రీ నిత్యానంద గృహస్థాశ్రమము,
కాకినాడ-తూరంగి.

ఇట్లు,
శ్రీ స్వామి దాసు.

ఈ శతకమును పఠించి ఆనందించు భక్తులలోని యేయొక్క శక్తిచేతనైనను పూజనీయులు, కీర్తిశేషులైన మా మామగారు వారణాశి లక్ష్మీనరసింహముగార్కి (బందరు) ఆత్మశాంతి చేకూరులాగున శ్రీ శ్రీ శ్రీ శ్రీనివాసుని ధ్యానించడమైనది.

# కృతజ్ఞత

---

నాలో భక్తిభావములు మొలకలెత్తి రచన కుపక్రమించ డాన్కి దోహదకారియై అడుగడుగు నా ఉత్సాహపఱచి శతకము పూర్తిచేయడాన్కి సహకరించిన నాపతిదేవులకు నా అజన్మాంత కృతజ్ఞత.

స్వామి మహిమలను ప్రభోదించిన గురుతుల్యులు శ్రీ స్వామిదాసుగార్కి సర్వదా నా కృతజ్ఞత.

ఇట్లు,
ఎస్. వారణాశి.

---

# శ్రీ గోవింద శతకము

---

1. శ్రీ వేంకటేశ! శ్రీ శ్రీనివాస!
భక్తులమానస మందిరములె
నీకుస్థిరనివాసము లౌనుకద!
భక్తజనావళి హృదయాంతరాళ!
బహిర్గతభక్తిభావ న్రాస్రవంతులె!
నీకు నిజతటాకములనగ నొప్పు!
భక్తకోటి పవిత్రపూజా గృహంబె!
దోచునునీకు నందనోద్యానవనముగను!
విహరింతువందు యథేచ్ఛగను!
ముద్దుసతులంగూడి ముచ్చటగను
మురిపింతువు, మురిపింతువుతుదకు!
తరింపచేయుదువు భక్తులనెపుడు హరిగోవిందా॥

2. విమలమనస్కులౌ భక్తులగానామృతంబె
నీవుసేవించెడి సురాపానమైయలరు!
భక్తులుప్రీతి నర్పించెడి ప్రసాదమాత్రములె!
పంచభక్ష్యపరమాన్నము లౌనునీకు హరిగోవిందా॥

3. నాగస్వరమువినిన నాగేంద్రునివోలె!
నడయాడుచు నరుగుదెంచుదువకట!
రయముగ నిక్కట్లనుబాపగన్!
నినునమ్మినవారి మొరలాలకించి హరిగోవిందా॥

4. క్షీరసాగర మథనంలో!
తొలుత హాలాహల ముద్భవించినయటులె!
సంసార సాగర గమనంలో! హాహా కారముసల్పునట్లుగన్
బహుతరక్లిష్టసమస్యలనుబెట్టి!
భక్తులక్షమదమాది గుణముల
పరీక్షించుచుందువుకద హరిగోవిందా॥

5. సహనశీలురై నీదుపరీక్షలందు!
మహిని నిల్రదొక్కుకున్నవారె నిక్కముగను!
నీదు కృపాకటాక్ష వీక్షణములకు పాత్రులౌదురు!
కాదన్నదూరులౌదురు హరిగోవిందా॥

6. ఆకలిదప్పిక లుండవుదేవ!
నిన్నుమనసార ధ్యాన్నించినంత!
ఈ కలియుగంబున అవతరించిన
కరుణామయుండవయ్యా హరిగోవిందా॥

7. సకలచరాచర జీవకోటిలో
ఎందుచూసినఅందే కలవుకద!
పాపపంకిలమున మునిగితేలెడి మమ్ము
పావనముచేయుమయ్యా హరిగోవిందా॥

8. శ్రీరమారమణ! వేంకటరమణ
శరణు శరణు అన్నవారిని బ్రోతువు!
ఆర్తత్రాణపరాయ ణుండనుబిరుదు
తగునయ్యా నీకు నిక్కముగను హరిగోవిందా॥



9. సకలజనులూ సుఖీభవ!
సర్వమానవ సమతాభావ మెహర్షింతువు!
లోక కల్యాణమె హితమునీకు!
జగదాధారా! హరిగోవిందా॥

10. లయమందున జ్ఞానతిమిరచ్ఛాయలు!
వికశించును మానస కుసుమములు!
నీదుసందర్శన మాత్రమున నెగాదె!
జన్మచరితార్థమగుట హరిగోవిందా॥

11. సర్వాంతర్యామివై వెలుగునీకు!
నామరూపరేఖా విలాసములుతలుప
దుస్సాహసంబెయౌను! పరమాణువు
నందుకూడ పరమేశ్వరుడుండు హరిగోవిందా॥

12. పన్నగశయునా ఎన్నగతరమా!
నీలలు? ఏలీలనేలెదోయిలను!
తలనీలాలర్పించినంతనె! కరుణంతువుకద!
భక్తులపాలిటకల్పతరువా! హరిగోవిందా॥

13. గురియున్నవారిని దరిజేర్చుకుందువు!
కరినికాచిబ్రోచిన హరివినీవకావ!
మురారి! శంఖుచక్రగదాధారీ!
దారిబారినుండి కావుముమమ్ము హరిగోవిందా॥

14. రామావతారమున రమణివేదవతికి!
వరమిచ్చితీర్చినావు తిరుమలేశ
పద్మావతీదేవిని సతిగజేపట్టి
కృష్ణావతారమున కలికిదేవకీదేవికి

యిచ్చినవరమును దీర్పగా!
కొమరుండవైతివయ్యా వకుళమాతకు!
కామితార్థ ప్రదాయకుడవై పుడమి
వెలసినావయ్యా! శ్రీనివాస! హరిగోవిందా॥

15. భక్తిభావమునకే బందీవౌదువు!
ముక్తిమార్గము నఱచేతనెచూపింతువు!
శక్తినిచ్చి చేయూతనిచ్చి!
కడతేరించు మా కష్టములను హరిగోవిందా॥

16. నిఖిలావని నిండెనులే నీదుమహిమ!
సకలజనులుసన్నుతింతురు నినుభక్తినెలమి!
ఏనూటికొక్కరో నీప్రియతమ శిష్యులౌట!
ఎఱుగతఱమె ఏరికైన!
నీ అనుగ్రహపాత్రుడైన పుణ్యాత్ముడు!
ధన్యజీవియైయొప్పు ధరణిన్ హరిగోవిందా॥

17. నిలకడలేని మనసు
నిశ్చలతలేని భక్తి!
నిగ్రహములేని తనువు
నిరర్థకంబుగాన! అచంచలభక్తి
విశ్వాసములు, ధృఢచిత్తమునొసగుము హరిగోవిందా॥

18. అక్షులందుసూర్య చంద్రద్వయమున్!
వక్షస్థలమందువనజాక్షులు శ్రీదేవి, భూదేవియుజ్ఞ!
కుక్షిభరంబున సువిశాల విశ్వమంతయుజ్ఞ నెలకొని
అక్షయంబగువరములిచ్చుచురక్షించుచుంటివి హరిగోవిందా



19. వడ్డికాసుల వాడవందురు నినుబహు
దొడ్డవాడవు కదయ్యా నీవు!
గ్రుడ్డిగనిను మదినమ్మియుండెడి
చెడ్డవారికైన ముక్తినిత్తువు హరిగోవిందా!

20. నెన్నుదుటబాసించు దివ్యమంగళ నామంబె
త్రిమూర్తి స్వరూపంబై గోచరించు!
ఈశ్వర బ్రహ్మలిద్దరు ధవళవర్ణంబునవెలయ!
నడుమనిండు కస్తూరితిలకమై హరి మెప్పుచుండు!
అవతారపురుషుడవై అలరారునీవు!
అభయహస్తంబు నొసగి ఆదరించుమము హరిగోవిందా!

21. భక్తుల ప్రార్థన లాలికించుటె వ్రతము నీకు!
భక్తితోనిచ్చెడి పత్రమైనచాలు నీకు!
వామహస్తంబు నందుకొందువు మా చిన్నికానుకల
దక్షిణహస్తంబున ధారాళముగ, నిత్తువు!
నీపాదకమలములు నిష్కామముగ కొల్చినజీవి!
యిహపర సౌఖ్యములొందుట తథ్యము హరిగోవిందా!

22. అహంభావమె అనర్థహేతువని!
అహంకారమెనినుచేరు సోపానారోహణకు!
అనర్థ దాయకంబగునని!
అణచివేయుదు వెప్పటికప్పుడు!
భృగుమహాముని వైన మట్లుగాదె!
మృగతుల్యులమౌ మా భారమునీదే హరిగోవిందా!

23. తొలుత నా పాదములకు మ్రొక్కు!
తొలి మీ పూజాఫలముదుక్కు!

అనుచు మాకు తెల్పుచుండెనో యనంగతోచు
నీదు శుభకరయుగ్మంబు
కోటి ప్రభాకరభాసమాన హరిగోవిందా!

24. కృతయుగంబున వృషభాసురుడు!
ప్రీతిని నీతో సమరంబు సలుప!
వాని తుదికోర్కెగ నీగిరికిన్!

1 'వృషభాద్రి' అనునామంబు కలిగె!
త్రేతాయుగమున అంజనాదేవి
అకుంఠితదీక్షబూని పుత్రార్థియై తపముజేయ!
2 'అంజనాచలంబని' పేరుగల్గె నాడుమొదలు
ద్వాపరయుగమున నొకపరి
వాయుదేవునకు ఆదిశేషునకు యుద్ధమువచ్చినతరి
3 'శేషాద్రి' యను నామంబువడసెనీగిరి!
కలియుగంబున పాపపరిహారిగిరియని!
4 'వేంకటాచలంబయ్యె' తదుపరి!
వరాహమూర్తిని వశించి నగిరిఅగుటంజేసి!

5 'వరాహగిరి'యై విలసిల్లెనపుడు
6 ఇంకను 'గరుడాద్రి' 7 'నారాయణాద్రి'
యను సప్తాద్రులపైవెలసినావుకదయ్యా! హరిగోవిందా!

25. ఈశ! జగదీశ! కల్యాణవేంకటేశ!
నీనెలవౌ తిరుపతి పుణ్యక్షేత్రమందుండు
పుష్కరణి, కుమార, నారద, కపిల, సప్తర్షి
తుంబురు, చక్ర, కృష్ణ, ఇంద్ర



పంచాయుధ, బ్రహ్మతీర్థములయందు
స్నానమాచరించినంత పుణ్యగతులుండునయ్యా!
హరిగోవిందా!

26. స్వామిపుష్కరిణి తీర్థమునకు తూర్పున
మార్కండేయ తీర్థము, పశ్చిమమున వాయుతీర్థము
ఆగ్నేయమున అగ్నితీర్థము, వాయువ్యమునందు
వరాహతీర్థము, దక్షిణమున యమ, ఉత్తరమున
కుబేరతీర్థములు, నైఋతిన వశిష్ఠతీర్థము
ఈశాన్యమందు గాలవతీర్థము, మధ్యమందు
సరస్వతీ తీర్థము వెలసియుండు
యిమ్మహిమాన్విత తీర్థసంపద పొందియున్న
పుణ్యక్షేత్రమౌ తిరుపతిలో
పుట్టి గిట్టినా, పుట్టక గిట్టినా పుణ్యమేకద! హరిగోవింద!

27. తమ కొసరితయుద్వాహవిషయమై!
ఆకాశహర్మ్యాలు నిర్మించు కొనుచుండ
ఆకాశ రాజదంపతుల కపుడు!
సామాన్యునిబోలె పరిచయంబై
వేషము మార్చి స్త్రీ రూపముదాల్చి
మతులుమార్చి అనమానుండవని నిరూపించి!
పద్మావతీ పాణి గ్రహించితివి కదయ్యా! హరిగోవిందా!

28. భ్రమరంబువిరిని పరిభ్రమించునట్లు!
పరిభ్రమించునయ్య నిన్ను భక్తుని మనస్సెపుడు!
నీ నామసంకీర్తనల సారమెల్లగ్రోల!
తనవితీరదెప్పుడు! హరిగోవిందా!

29. అలుమేలు మంగావతీ!
మమ్మేలిమంగా పాడనీవేగతి!
యిమ్మహిని నీ మహిమ!
కమనీయము రమనీయము కనుగొంటే హరిగోవిందా!

30. నినుదలంచి బూనినంత సంకల్పసిద్ధియగును
ఎదురొచ్చిన అడ్డంకుల నెదపట్టనీయకనె!
తుదముట్టించి మరిసాధింపింతువు!
సదా నిను స్మరించుటెకదా మా కర్తవ్యం! హరిగోవిందా!

31. గోవింద! గోవింద! గోవింద! అని ముమ్మారుచ్ఛరించిన
ముచ్చట్లు, మురిపాలుతీరు!
పదిమార్లు పలుకుచుండినంతనే
పాపపంకిలము ప్రక్షాళితమైపోవు!
నోరారా నూరుసార్ల న్నంత
నోములన్నియు ఫలించుట సత్యము!
ఐదువందలసార్లు పఠించిన
ఐదవతనము, ఐశ్వర్య సిద్ధికల్గు!
సహస్రంబుగ స్మరించినతోడనే
సకలా భీష్టసిద్ధి యగునుకద! హరిగోవిందా!

32. దీపశిఖనుగని దివ్యభోజనంబని!
అత్యాశనుఅగ్నికి అహుతియౌశలభములవోలె!
అజ్ఞానులైన జనులు అకర్షణలకులోనై!
అవనినశింతురయ్య అనామకులుగ!
కలలబ్రతుకులు కల్లలనికనువిప్పు!
కల్గింప కరుణించి రావయ్య! హరిగోవిందా!



33. భోగ లాలసనువిడచి!
రాగ ద్వేషములుమాని!
యోగ సాధనచేయుటయే!
కాగలదేమో నినుజేర దగ్గరదారి! హరిగోవిందా!

34. ఈ సువిశాల సుందరజగతి
చైతన్యముపొంది చరించు నీయానతి!
మేమంతా నిమిత్తమాత్రులం దేవా!
మాజీవన గమ్యం అగమ్యం మాకు!
సుగమంబౌ, సులభంబౌ బాటచూపించుమాకు!
అజ్ఞానులం ఆలంబన నీవేనయ్య! హరిగోవిందా!

35. అరుణోదయ రేఖలందు!
మధ్యాహ్న మార్తండ ప్రచండ ప్రతాపమునందు!
సాయం సంధ్యాసమయ కాంతులందు!
గాఢాంధకారని శిథమందు!
పండువెన్నెల నిండు పున్నమియందు!
క్షీరమందు, నీరమందు, ఎందుజూసిన
నందే కానవత్తువు భక్తులకపుడు! హరిగోవిందా!

36 ఈశ వేంకటేశ!
ప్రీతిని సుప్రభాత గీతి నాలాపించిన!
భక్తుల నిద్రాణశక్తులను మేల్కొల్పుదువట!
మధ్యందిన పూజాదికంబులు శ్రద్ధగనొనర్చిన
మృష్టాన్న భోజనంబులు సమకూర్తువట!
సాయం సంధ్యను సంకీర్తించిన!
సంతుష్టాంకరంగుడవై సంరక్షింతువట!

పరిపూర్ణ మానసంబున పవళింపు సేవచేసిన
కామక్రోధాది షడ్గుణంబుల పాఱద్రోలి
పరిపూర్ణ మానవునిగచేతువట! హరిగోవిందా!

37. గోవిందా! భజ గోవిందా అని భజనచేసిన
బంజరు భూములవంటి హృదయాలుసైతం
భక్తిసారమును తప్పకపొందునట!
అంతటినీకరుణా రసవృష్టి కురిసినంతనె
భక్తి బీజములె మొలకలెత్తునట!
అమ్మొలకలె చిగురించి పుష్పించి
ఫలోన్ముఖమును చెందుటయెయగునట!
నీదు ప్రత్యక్ష సాక్షాత్కారము పొందగల్గుట! హరిగోవిందా!

38. భక్తిపూర్వక ప్రణామప్రదక్షిణము లాచరించిన
పాత్రులౌదురట! పరమ సౌఖ్యములకు
భక్తిని నీకు నీరాంజనంబొసంగినంత
విజ్ఞానాంజనం బొసంగుదువట! నేత్రములకు
ప్రాసాదములువలదు నీ ప్రసాదమెచాలనివేడిన
ప్రసాదింతువట సుఖప్రదమౌ పరమపదము హరిగోవిందా!

39. హస్తద్వయము ముకుళించి
చిత్తశుద్ధిని నిన్నుప్రార్థించి!
స్వాతిశయమువిడచి! స్వామిసన్నిధివినా
యితరంబునాకేమి వలదన్న బ్రోచెదవయ్యా హరిగోవిందా!

40. శ్రీ వేంకటాచలతీ! ఏరీతినేలెదో
ఈ జగతి! కాలగతిని ప్రగతి!



పథముంజేరమతిలేని మాకిక నీవేగతి!
సత్పథగాములుగామనగన్ సంస్కరింపుము హరిగోవింద!

41. సర్వమునీవే అనిగ్రహించి!
సర్వస్వము నీకె అర్పించినవారు!
సర్వజ్ఞులౌదురనుట సత్యము!
సర్వమానవ సౌభాగ్యానికే కంకణం
కట్టితివికదయ్యా! హరిగోవిందా!

42. వందనంబిదెకొనుమ హరిగోవిందా!
నీసుందరవదనార విందమగు ము!
నాడెందమమందానంద డోలికలూగుచు
చందన గంధమ లందినట్లుండుగద! హరిగోవిందా!

43. బిడ్డమనసుమాతకు మాత్రం విదితం!
భక్తుని మనోగతం నీకే అవగతం!
అపరిమితం! అనంతం,! నీమహాత్యం
అదికనుగొనుటే పూర్వజన్మసుకృతం! హరిగోవిందా!

44. సకల వేదసారమునీవేనట!
సమస్త జగదాధారము నీవేనట!
అంధకారబంధురమౌ మాబ్రతుకులలో
ఆశాకిరణాలు చూపించుమయా! హరిగోవిందా!

45. కీర్తికండూతిని కొలుతురు కొందరునిన్ను!
ఆర్తినిపొంది అర్థిందురు మరికొందరు!

భర్తీచేయుగ ధనాగారములు, ధ్యానింతురు యింకా కొందరు!
మనస్ఫూర్తిని ప్రార్థించినవారె అర్హులునీ అనుగ్రహమునకు
హరిగోవిందా!

46 నీలాలనింగిలో నిన్గంటి నొకక్షణం!
అంతరిక్షమున అంతర్ధానమైతివి తక్షణం!
అనుక్షణం నీ ప్రత్యక్షం అనుగ్రహించి
అక్షయవరదాయక రక్షింపుము! హరిగోవిందా!

47. తిరుమలేశ! తిరుపతి వెంకటేశ,
సప్తశిఖరాలపై వెలసిన నీ కటాక్ష వీక్షణం!
భక్తి తత్పరులకు మాత్రంప్రాప్తం
భక్తిలు ప్తమౌచోట గుప్తముగనే ఉందువట! హరిగోవిందా!

48. స్వామీ! మమ్మందఱి నీదాసానదాసులుగ స్వీకరించు
నీపాదారవిందములపై వాలునట్లను గ్రహించు!
మాహృదయభాండంబుల భక్తిరసంబున నింపియుంచు!
అండ పిండ బ్రహ్మాండమంత నిండియుంటివయ్యా!
హరిగోవిందా!

49. అనాథరక్షకా! ఆపద్బాంధవ గోవిందా!
అవతరించినావ అందాల దేవా!
ఆనందింతువయ్యా మమ్మాడించుచు
జగన్నాటక సూత్రధారివి నీవయ్యా! హరిగోవిందా!

50. గర్వమధాంధత్వంబున భ్రమించి
సర్వముమఱచి! నియమనిష్టల త్యజించి!
సత్వరమ్మున నిన్మదివిస్మరించి చరించు
కలుషాత్ముల కరుణించుమ! దయతో హరిగోవిందా!



51. పరమ పవిత్రాత్ములకుదక్క పరమాత్మ కానరావు!
పరమౌత్కృష్టమౌ పరంజ్యోతిని కనుంగొన
పరమేశ్వర పరులకు సాధ్యమౌనే!
పరమభక్తి పరులకుగాక! హరిగోవిందా!

52. సత్యము నిను భక్తవత్సలుడనుట
నిత్యము నిన్గొలుచు భృత్యులెల్లడల
కృతకృత్యులౌచుందుర అది నీనామ,
మహత్యంబు కాక మరేమిటయ్యా! హరిగోవిందా!

53. మత్స్య, కూర్మ, వరాహ, నరసింహ, వామన
పరశురామ, రామ, కృష్ణ, బుద్ధ కల్క్యవతారముల
నెత్తి! మత్తరక్కసులమదంబడంచిన మాధవామధుసూధనా
కలియుగంబున కల్యాణవేంకటేశునిగ అవతరించితివా
హరిగోవిందా!

54. కంటకమయమౌ బ్రతుకుబాటలో!
ఒంటిగనడచే మాకుజంటగ నిలువగదయ్యా!
సంకటహరణా! వెంకటరమణా!
కంటనిన్గంటి నేని! నాపంటపండుగదా! హరిగోవిందా!

55. అహర్నిశములు నిను తలంచినతఱి!
యిహపరసౌఖ్యములు తప్పవుమఱి!
మహరాజైనను సామాన్యుడైనను నీకై
తహతహలాడుటె చాలును నీకు! హరిగోవిందా!

56. పద్మనాభా! పద్మావతీప్రియా! నీపాద
పద్మములే భక్తజన హృన్మందిరాల!
నెలకొనియుండు నెల్లవేళలన్
యిలధర్మ సంస్థాపనచేయగ! దయజేయుమయా
హరిగోవిందా!

57. కర్మబద్ధులై కొందరు నిన్గన; మర్మమఱయలేరు!
ధర్మపథంబువీడి చరింతురుపాప
కర్మల నెన్నిటినో చేయుచుందురు! అట్టివారిని
నిర్మలులుగజేయ నీదెభారమయా! హరిగోవిందా!

58. బాలాజీ కష్టాల కడలిలో తేలుమాకు!
ఏలా ఈ పరీక్షలఅలలు! ఏమినీలీలలు!
కాలానికి కళ్ళెంవేయగ నీ
లీలామయమౌ! చర్యలుకనుగొన మాతరమా! హరిగోవిందా!

59. నీనాభి ప్రభవించిన విరించిప్రభోధించగా
విశ్వవిపంచినే వాణిమీటించ! భృగుడుకోపించ!
నారదాది మునుల్ పఠించువేదఘోష మేళవించ
సమయోచితంబని తలంచి! చనుదెంచితివట భూతల
మునకు హరిగోవిందా!

60. నీ నీల మేఘశ్యామవర్ణం! నిత్యానుగ్రహ కారణం!
నిర్నిమేషనేత్రద్వయం! నీనమ్మిన బంటులకిచ్చు అభయం!
నీశుభప్రదమౌకరయుగళం! భక్తులకిడునిత్యశుభమంగళం!
నీదివ్యపాదారవిందములె! ప్రజాపాపహరములు
హరిగోవిందా!



61. శ్రీలక్ష్మిని, భూలక్ష్మిని స్థిరముగనిల్పుకొంటివట
శ్రీనివాస! నీదు వక్షస్థలాలయమందున
కువలయాపీడ తొలగింప అవతరించితివట
అనంత పద్మనాభ! ఆదరించుమము! హరిగోవిందా!

62. సంకల్ప వికల్పములునీవి! సకలమునీవు!
వికలమౌ మనసున నిలకడగ నిన్గనలేకుండనున్నాను!
వ్యధలబాపి సుధలనురిపించి హృదిచిగురించ
కదలిరావయ్య కరుణాపయోనిధీ! హరిగోవిందా!

63. ఇందిరారమణ! నమో వేంకటరమణ!
సుందరాకార యోభక్తమందార!
అందరమయ్యేదమయ్య నీసుగంధ బంధుర!
కదంబ కంఠమాలగ! మా హృదయకుసుమాలె!
నీదు పూజాప్రసూనములుగ స్వీకరించు! హరిగోవిందా!

64. అండజవాహన దండమయా నీకు!
కొండలపైవెలిసిన నీవెఅండ నిజముగమాకు!
బండమానసులైననిండియుంద్రు నీ భక్తితోడ
మెండుగనీనామోచ్చారణసల్పు నుండినవారె ధన్యులు
హరిగోవిందా!

65. ప్రమోదభరితం నిన్నుపేక్షించుట!
ప్రమాదభరితం నిన్నుపేక్షించుట!
ప్రహ్లాదుడు, హిరణ్యకశిపులు లేరాసాక్షి!
ప్రత్యక్షంబౌదువు ప్రయత్నలోపంలేకుంటే! హరిగోవిందా!

66. రామావతారమున రాతినినాతిగచేసిన నీవు!
కృష్ణావతారమున కోతినిజయించినాతిని చేపట్టితివికద!
వరహావతారమున భూమాతనుమూతినిడుకొని కాచిననీవే!
నాతిరూపమునుబొంది పంచితివయ్యా అమృతమును!
హరిగోవిందా!

67. భ్రాంతినొందిననేను విభ్రాంతనైతి నీ లీలలుగని!
అతిత్వరగ నీదర్శనమీయకున్నను నిదర్శనలిత్తువయ్యా!
గుడియుంచి గ్రహించి భక్తిమేర పూజించినంతనె
గుర్తించి ఆదరించెదవుకదయ్యా! హరిగోవిందా!

68. ఆదివారమునాడు అలరించవత్తువు!
సోమవారమునాడు శోధించవత్తువు!
మంగళవారమునాడు మంగళంబీయవత్తువు!
బుధవారమునాడు బుద్ధులుగఱపవత్తువు!
గురువారమునాడు గురుబోధచేయవత్తువు!
శుక్రవారమునాడు సుఖములీయవత్తువు!
శనివారమునాడు శనిని పంపగావత్తువుకదయ్యా!
హరిగోవిందా!

69. నీకు మ్రొక్కెడి శిరమెధన్యతమము!
నినుసేవించెడి శరీరమె పుణ్యతమము!
నినుతలచెడి మనసె మధురతరము!
నినుగాంచగల్గెడి నేత్రములెపవిత్రములుసుమ! హరిగోవిందా!

70. సదానినుస్మరించిన చిదానందుడవై వర!
ప్రదాతవౌదువటకదా! ప్రభువర!
వ్యథాపూరిత హృదయులైనన్ నీసుధామాధురిన్!
బాధామయ జగతిఁ మరచితరించెదరయ్యా! హరిగోవిందా!



71. ఆపన్నుల ఆర్తుల దీర్చిదీర్చి అలసిన అమరనాథా!
ఆకాశ రాజపుత్రియౌ అలమేలుమంగ! ఆయసముదీర్చు నీకు
భక్తులకడకు పెత్తినాళ్ళలిపివచ్చిన నీ!
దివ్యపాదారవిందముల ప్రీతినొత్తునయ్యా! శ్రీదేవి!
దుష్టశిక్షణ, శిష్టరక్షణగఱపి భూభారమణచివచ్చిన నీకు
ప్రియమార వింటారగింపగజేయునయ్యా భూదేవి!
భీభత్స భయానకదుష్టశక్తులను బహుముఖ
ప్రజ్ఞాపాటవంబున జయించి! బడలివచ్చిననీకు
బీబినాంచారమ్మ మెచ్చగచుచ్చకములు సల్పునయ్యా!
హరిగోవిందా!

72 ధృఢవిత్తంబున చిరుతడు ధ్రువుడు!
గాఢభక్తిని తపంబాచరింప తారయైవెలెగె!
రూఢిగ నది నీ దయాదృష్టి ప్రసరణ వలనగాదె!
మూఢుడైనను ముక్తినిపొందు నీమహిమచేత! హరిగోవిందా!

73. గ్రహచారదోషములు గృహకల్లోలములు నీ
సహకారసంపత్తిని మాత్రమే తొలగిపోవు!
సహజంబుగ నిను స్మరించినంత సరసీ
రుహనయన సంరక్షింతువు హరిగోవిందా!

74 మానవసేవయందు మాధవ నీవుందువు!
గాన మాధుర్యమునందు మురళీధర! ముందేవుందువు!
చాన 'శ్రీరమ' నయనకమలముల కమలానాభ నీవుందువు
బిరాన మా కానతిమ్ము మంచిపనులాచరింప! హరిగోవిందా!

75. కళత్రద్వయం కలహింప లోకకల్యాణ వేంకటేశ!
కళవెళపడుచు కదలిపోయితివ నవోఢపద్మావతి!
కళలుడిగిన వదనంగాని, కలకంఠి శ్రీ లక్ష్మి:కంపిత
గళముగాని కదలించలేదయ్యానిను! హరిగోవిందా!

76. నీమృదు పల్లవతర కోమలపదములె!
హృదయాలనిల్పి సేవించిన యిలవేల్పువై
పృథ్విజనులనెల్ల పరిపాలింతువయ్యా!
వృషాద్రినివాస జగదీశ! హరిగోవిందా!

77. ఉగ్రరూపముదాల్చి వాడియౌనట్టి!
నఖాగ్రముల హిరణ్యకశిపుందును మాడినతఱి!
నిగ్రహముతో, నిను శాంతింపజేయ భక్త ప్రహ్లాదుడుచుతింప
ఆగ్రహమును వీడితివట! భక్తవత్సల! హరిగోవిందా!

78. నీ విస్మరణయె, విషాదప్రదమౌను!
నీ సంస్మరణయె సంతోషదాయకమౌను!
విస్మయముకల్గునయ్యా కౌంస్తుభమణిహారీ!
తస్మాత్ జాగ్రదనుచు హెచ్చరింతు వెప్పటికప్పుడు!
హరిగోవిందా!

79. సుఖదుఃఖంబులు వెలుగునీడలై!
వెన్నంటి మనుగడసల్పు మానవుడె!
సుఖముల మఱచి దుఃఖమునతలచు
కష్టములపెట్టి కడకు కరుణింతువ! హరిగోవిందా!



80. నీ దివ్యపాదపూజార్హతను పుణ్యఫలంబుపొందు!
ప్రసూనముమేలయ్యా ఈ మానవునికంటెను
పూదేనెగ్రోలనాశను నీ కంఠమాలనుచేరి నీ
మూర్థముమూర్కొను చిమయెమేలయ్యా! హరిగోవిందా!

81. నీ పలందుకొన్న చందనగంధము!
చందమామ చందమ్మున హిమకిరణమ్ముల
ప్రసరించునట్లుతోచు! భక్తుల మతులకెప్పుడు
సుందరవదన నా ఇరవిరాకముఖా! హరిగోవిందా!

82 ప్రథమంబున భక్తులశక్తులను పరీక్షింతువు
ద్వితీయమున అద్వితీయంబుగ దీవింతువు!
తృతీయమున తరతరముల తరింపింతువు!
చతుర్థమున నతిచతురతను నీయందైక్యము చేసికొందువు!
హరిగోవిందా!

83. భావసంద్రంమున బడి భావిగు రైతుగక!
భారము నీ పైననేయుంచి బ్రతుకుచుంటిమయ్యా!
భక్తిభావవీచికలతో, నీవెచుక్కానికాగా!
ముక్తిమార్గము దెసనావనడిపించవయ్యా! హరిగోవిందా!

84. శేషపాన్పుపై శయనించెడి శేషశైలావాస!
దుష్టులపాలిట భయంకరములు నీ నాగబంధితకరములు
శిష్టుల పాలిట చింతామణియౌను! నీ వక్షస్థంబౌ కౌంస్థుభం
వేషంబు లనేకరీతులమార్చుచు వేయికళ్ళతోచూతువయ్యా!
హరిగోవిందా!

85. అలవాలమౌను ఆదరణకు నీ కరుణాంతరంగం
అలవాలమున ననలంబున, లంకదహించి
అవని, అవనిజంజూసి అయ్యంగుళీయకంబిచ్చివచ్చిన
అనుగ్రహించితివికద! అంజనేయుని! హరిగోవిందా!

86. గండుకోయిలనై గళమెత్తి కీర్తింపలేను!
మెండుగ ఉపవాసాదికములు జేయగలేను!
నిండుమనసున ధ్యానించెదనయ్య నిన్ను!
దండనచేయకు స్వామి దండమయ్య నీకు! హరిగోవిందా!

87. వీణాతంత్రులు సవరింప సరిగమపదనిస
సప్తస్వరములను పల్కు, నా హృదయ
వీణియతీవెలనుమీట' శ్రీ వేంకటేశ్వరుండ
నియెధ్వనించునది! వినగరావయ్య! హరిగోవిందా!

88. చింతలుమాననీదు చింతనామృతపావనమున కలవడితి!
కష్టములు కడతేరకరుణించమని వేడగామరిగితి!
పుణ్యఫలములనుపొంద, నిను పూజింపపూనితి
మరుజన్మలేకుండ మన్నించమని కోరుచుంటినయ్య
హరిగోవిందా!

89. నీ పాదోదకముపానముచేసిన ఉదరబాధలుతొలగు!
నీ పార్చిత తులసిదళముతలదాల్చిన తులలేని భోగలతుల
తూగు
నీపాదాలపారాణిపైదాల్చిన పలుభంగులఫలముబొందు!
నీ పాదసన్నిధికోరి భజించిన పామరుడైన పరిణితిజెందు!
హరిగోవిందా!



90. నట్టనడిసంద్రాన! నా నావమునిగేను!
కట్టకడకైన! నినుచేరలేనేమొ!
చిట్టవుకదయ్య దివ్యదేవర! నాదు
పుట్టక సార్థకముచేయరావయ్య! హరిగోవిందా!

91. పశ్చాత్తాపమున పునీతుడైన పుండరీకునకు!
పరమజ్ఞానమోక్షముల ప్రసాదించి!
పుండరీక, వరదుడవై వెలసితివయ్య!
పండరిపురమున! పాండురంగవిఠల! హరిగోవిందా!

92. సతీసక్కుబాయి స్థానేనీవుండి!
అమె సందర్శనాభిలాషను తీర్పపంపితివయ్యా!
పండరి, నీ మాయలు తెలియనెవరివశమయ్యా!
భక్తులకోర్కెలుదీర్ప బద్ధకంకణుడవైతివయ్యా! హరి
గోవిందా!

93. గోదాదేవి యభీష్టము మేఅనాథుడవై
అయ్యాముక్తమాల్యదనను గ్రహించితివ శ్రీ రంగనాథ!
భక్తిపరుల కసాధ్యంబులేదని, నిరూపింతువయ్య!
భక్తులపాలిట కల్పతరువా! హరిగోవిందా!

94. మౌనవ్రతమె ఘనమౌవ్రతమౌను!
యౌనకాది మౌనివర్యులు, సనకసనందనాదులు!
అత్ర్యాదిఋషిపుంగవులు ధరిత్రిన్!
మౌనముపూని తపస్సంపత్తినిగాదె పొందిరినీదయను
హరిగోవిందా!

95. సతీ అనసూయ సతీత్వమును పరీక్షించనెంచి చనిన!
చతుర్ముఖ, చక్రపాణి, పినాకపాణులు ముప్పురు!
ముచ్చటగ ముద్దుబిడ్డలౌటలోని అంతరార్థమయి
నామె పాతివ్రత్యమహాత్మ్యమా చంద్రతారార్కమై వెల్గంగ
గాదె! హరిగోవిందా!

96. శ్రీ కృష్ణా! రథసారథ్యము వహించి! గీతబోధించి!
కిరీటిని యుద్ధసన్నద్ధునింజేసి! పాంచజన్యము పూరించి!
పార్థుని విజయునిగావించిన పరమాత్మా!
మా జీవన! రథసారధివై! విజేతలంచేయుమయ్యా!
హరిగోవిందా!

97. నీ అనుగ్రహమువడసి! నినుజేరగల్గునటులె!
నీ ఆగ్రహమునకు గురియై! నీచే జంపబడినవారు సైతం
పరమపదంబునుపొందు రదియె నీ మాయ
నీ హస్తముల వస్తమించుటకూడ నొకవరమెమౌను!
హరిగోవిందా!

98. పాలకడలిపై పవళించి మురిపాలకడలిని!
తేలింతువయ్యా పాలమనసుల నెప్పుడు! పరి
పాలింతువయ్యా! పద్మదళాయతాక్షి శ్రీ మహాలక్ష్మి!
హృదయసామ్రాజ్యమును! శ్రీ హరిగోవిందా!

99. నీ దివ్యమంగళ విగ్రహము గాంచంగ తనివిదీరదన్నట్లు!
సువిశాల నేత్రద్వయంబుల నిన్నేతిలకించుచున్నట్టి!
శ్రీ లక్ష్మి క్రీగంటిచూపుకై తహతహపడుచుండిమయ్యా
ఆదిలక్ష్మితోడ నవతరించి ఆదరించవయ్యా మమ్ము!
హరిగోవిందా!



100. నిత్యశుభమంగళం నీకు నీరజాక్ష!
నిత్యకల్యాణం పచ్చతోరణంబౌట!
సత్యము, నిత్యము నినునమ్మి కొల్చినంత!
భృత్యులమము రక్షించవయ్యా! శ్రీ శ్రీ శ్రీ హరిగోవిందా!

101. భాషరాదు, భావములేదు
ఘోషపెట్టెడి యెదనూరడింప
శేషాచలపతీ చేసితినయ్యా ఈ చిన్నియత్నం
యిందలి తప్పులుఒప్పులుగ మన్నించి మమ్ము కావుమయ్యా
హరిగోవిందా!

సమాప్తం

